శ్రీ గురుభ్యో నమః

# సహస్ర కమలవర్తి వ్రతకల్పము

శ్లో॥ శుక్లాం బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్న వదనం ధ్యాయే త్సర్వ విఘ్నోపశాంతయే॥

శ్లో॥ తదేవలగ్నం, సునంతదేవ తారబలం చంద్రబలం
తద్దైవ విద్యాబలం తదేవ లక్ష్మీపతే
తేంఽఘ్రి యుగం స్మరామి ॥

ఆచమ్య । ఓం కేశవాయ నమః
శుభతిథౌ శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం
పుణ్యవతి గోత్రవతిః........నామధేయవతి
కల్పోక్త సంపూర్ణ సకలఫలా వాప్త్యర్థం
శ్రీ లక్ష్మీనారాయణ ముద్దిశ్య....ప్రీత్యర్థం మమ
శ్రీ కృష్ణాయ నమః, శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

సంకల్ప్య :- ఓం ప్రాణాయామస్య ప్రజాపతి ఋషిః త్రిష్టుప్ఛందః పరమాత్మా దేవతా దేవీ గాయత్రి ఛందః ప్రాణాయామే వినియోగః, ఓం భూః, ఓం భువః, ఓం సువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః; ఓగ్ం సత్యం, ఓం తత్స వితుర్వరేణ్యం; భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్, ఓమాపోజ్యోతీ రసోమృతం బ్రహ్మభూర్భువస్సువరోం మమ ఉపాత్త దురితక్షయద్వారా

శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభన ముహూర్తే శ్రీమహా విష్ణు రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయ పరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే, కలియుగే ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోః దక్షిణ దిగ్భాగే, శ్రీశైలస్య, కృష్ణా గోదావర్యో మధ్యే, ఈశాన్యప్రదేశే, ఆగ్నేయకోణే, ఆంధ్రప్రదేశే, అస్మిన్వర్త మాన వ్యావహారిక, చాంద్రమానేన....సంవత్సరే....ఆయనే ....ఋతౌ....మాసే....పక్షే....వాసరే....శుభ నక్షత్రే, శుభ యోగే, శుభకరణ, ఏవం గుణ విశేషణ విశిష్టాయాం, శుభ తిథౌ, శ్రీమతి పుణ్యవతి గోత్రవతి నామధేయాః............ ఆయుష్యాభి వృధ్యర్థం, మమేహ జన్మని జన్మాంతరేషు, సమస్త పాపక్షయార్థం, విశేషేణ, అస్మిన్జనని; ప్రథమార్తవ దిన మారభ్య ఏతావత్పర్యంతం ఋతు కాలిక శాస్త్రీయ నియమ లోపేన అజ్ఞానంతో రజస్వలాన్యోఽన్య స్పర్శాది దోషేణచ సంపాదిత మహాపాప నివృత్యర్థం కామలో నిషిద్ధ కాలకృత మైధునాదిదోష ప్రాయశ్చిత్తార్థం కాముక, వాచిక మానసికాన్యతమ, వ్యభిచార పురుష స్త్రీ సంభాషణాది ప్రాయశ్చిత్తార్థం, పాతివ్రత్య ధర్మలోప ప్రాయశ్చిత్తార్థం శరీరారోగ్య సిద్ధ్యర్థం సమస్త రజోదోష పరిహారార్థం శ్రీ లక్ష్మినారాయణ ప్రీత్యర్థం సహస్ర కమల ప్రతాం గత్వేన శ్రీ లక్ష్మినారాయణ పూజాం కరిష్యే. తదంగకలశారాధనం కరిష్యే విధి ప్రకారేణ గణపతిపూజాం కృత్వా తతః మండ

పారాధనం కరిష్యే, పంచలోకపూజాం కరిష్యే, ఆదిత్యాది నవగ్రహారాధనం కరిష్యే. ఇంద్రాద్యష్ట దిక్పాలక పూజాం కరిష్యే. లక్ష్మీనారాయణ ప్రతిమ; శోధన మండపారాధనం కరిష్యే వరుణ కలశారాధనం కరిష్యే.

ఆచమ్య....శ్రీ లక్ష్మీనారాయణ ప్రీత్యర్థం షోడశోప చార పూజాం కరిష్యే ॥

తదంగ కలశారాధనం కరిష్యే కలశస్య ముఖే విష్ణు శ్రితా ॥మం॥ ఆకలశేషు....రాపఠం

శ్లో॥ గంగేచ యమునే కృష్ణె గోదావరి సరస్వతి నర్మదే సిన్ధు కావేరి జలేఽస్మిన్ సన్నిధింకురుః॥ ఆయాంతు శ్రీ లక్ష్మీనారాయణ దేవతా పూజార్థం మమ దురిత క్షయకారకాః । కలశోదకేన పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య ॥ దేవమాత్మానంచ సంప్రోక్ష్య అద ప్రాణ ప్రతిష్ఠాపనం కుర్యాత్॥ ఓఅసునీతేపునరస్మా సు ముపహతే ॥ స్థిరోభవ । వరదోభవ సుము ఖోభవ । సుప్రసన్నోభవ స్థిరాసనం కురు ॥

## అథ ధ్యానం

శ్లో॥ సహస్రార్క ప్రతీకారం పద్మపత్ర నిభేక్షణం ।
కోటికం దర్పలావణ్య దివ్యమాల్యాంబలావృతమ్॥
లక్ష్మీసమేతం దేవేశం పీతకౌశే యవాసంప
తం కిరిణ ముదారాంగ ధ్యాయే ల్లక్ష్మీపతిం హరిం॥

శ్రీ లక్ష్మీనారాయణ పరబ్రహ్మణే నమః ॥
ధ్యానం సమర్పయామి.

ఆవాహనం

శ్లో॥ ఆవాహనం జగన్నాథలక్ష్మ్యా సహ జగత్పతే ।
యావత్త్వం పూజయిష్యామి తావత్త్వం సుస్థిరోభవ॥ ఆవాహనం సమర్పయామి
॥లక్ష్మీనారాయణ॥

సింహాసనం

శ్లో॥ సింహాసనం మహద్దివ్యం హేమరత్న సమన్వితం
మయానివేదితం తుభ్యం గృహాణ జగతః ప్రభో

లక్ష్మీనారాయణ పరబ్రహ్మణే నమః ॥ సింహాసనం సమర్పయామి.

పాద్యం

శ్లో॥ పాద్యం గృహాణ దేవేశ గంధపుష్పాక్షతలైర్యుతం ।
కరుణాకర దేవేశ గంగాజలమిదం ప్రభో ॥

లక్ష్మీనారాయణ పరబ్రహ్మణే నమః ॥ పాద్యం సమర్పయామి.

అర్ఘ్యం

శ్లో॥ అష్టద్రవ్య సమాయుక్తం స్వర్ణపాత్రస్థితం జలం ।
గృహాణదేవ సర్వజ్ఞ సర్వదేవ నమస్కృత

లక్ష్మీనారాయణ పరబ్రహ్మణే నమః
అర్ఘ్యం సమర్పయామి.

## ఆచమనీయం

శ్లో॥ దేవదేవ జగన్నాథ పురాణ పురుషోత్తమ ।
మయాదత్త మిదం తోయం గృహాణాచమనం ప్రభో ॥
లక్ష్మీనారాయణ పరబ్రహ్మణే నమః
ఆచమనీయం సమర్పయామి.

## మధుపర్కం

శ్లో॥ గోక్షీరదధి సంయుక్తం శర్కరామధు సంయుతం
గృహాణ దేవదేవ సర్వజ్ఞ సర్వగీర్వాణ సేవిత ॥
లక్ష్మీనారాయణస్వామినే నమః
మధుపర్కం సమర్పయామి.

## పంచామృతస్నానం

శ్లో॥ పంచామృతైః కురుస్నానం వేదమంత్రైస్సు
సంయుతం గృహాణ దేవసర్వజ్ఞ లక్ష్మ్యాసహ జనార్దన॥
లక్ష్మీనారాయణస్వామినే నమః
పంచామృతస్నానం సమర్పయామి.

## శుద్ధోదకస్నానం

శ్లో॥ నదీనాం చైవ సర్వాసామానీతం । నిర్మలోదకం
స్నానం స్వీకురు దేవేశ మయాదత్తం సురేశ్వరః ॥

లక్ష్మినారాయణ స్వామినే నమః
శుద్ధోదకస్నానం సమర్పయామి.

## వస్త్రం

శ్లో॥ వస్త్రయుగ్మం మయాదత్తం మసూక్ష్మం స్వర్ణ నిర్మిత
గృహాణ దేవదేవేశ సర్వవేదాంత గోచరః
లక్ష్మినారాయణస్వామినే నమః
వస్త్రయుగ్మం సమర్పయామి.

## యజ్ఞోపవీతం

శ్లో॥ సువర్ణతంతు భిర్యుక్తం బ్రాహ్మణా నిర్మితంపురా।
ఆయుష్యవర్ధనం దివ్యం దదామి సురనాయకా ॥
లక్ష్మినారాయణ స్వామినే నమః
యజ్ఞోపవీతం సమర్పయామి.

శ్లో॥ శ్రీగంధం చందనోన్మిశ్రం కర్పూరేణచ సంయుతం
విలేపనం సురశ్రేష్ట తవప్రీత్యై దదామ్యహమ్
లక్ష్మినారాయణ స్వామినే నమః
శ్రీగంధం సమర్పయామి.

## అక్షతాన్

శ్లో॥ అక్షతాన్ ధవళాన్ దేవశాలియాన్ తండులాన్ శుభాన్
హరిద్రామిశ్రితాన్ తుభ్యం గృహాణా సురసంహార ॥

లక్ష్మీనారాయణ స్వామినే నమః
అక్షతాన్ సమర్పయామి.

## పుష్పం

శ్లో॥ కరవీరైర్జాతి కుసుమై శ్చంపకై ర్వకుళై శ్శుభై శత
పత్రైశ్చ కల్హారైరర్చ మేయే త్పురుషోత్తమం ॥
లక్ష్మీనారాయణ స్వామినే నమః
పుష్పం సమర్పయామి.

గమనిక :- ఇచ్చట యథాశక్తిగా పుష్పములు మొదలగు వానిచేత సహస్రనామములైన, అష్టోత్తరములైనను చెప్పుకోవలెను.

## అథాంగ పూజా

ఓం కేశవాయ నమః - పాదౌ పూజయామి
ఓం గోవిందాయ నమః - గుల్ఫౌ పూజయామి
ఓం ఇందిరాపతయే నమః - జంఘే పూజయామి
ఓం అనఘాయ నమః - జానునీ పూజయామి
ఓం జనార్ధనాయ నమః ఊరూ పూజయామి
ఓం విష్టరశ్రవసే నమః - కటిం పూజయామి
ఓం కుక్షిస్థాఖిలభువనాయనమః-ఉదరంపూజయామి
ఓం లక్ష్మీవక్షస్థలాయనమః - వక్షస్థలం పూజయామి
ఓం శంఖుచక్రి గదాశారజ్గపాణయే నమః -
బాహూన్ సమర్పయామి

ఓం కంబుకంఠాయ నమః - కంఠం పూజయామి

ఓం కుందకుట్మల దంతాయ నమః -
దంతాన్పూజయామి

ఓం నాసాగ్రమౌక్తికాయనమః-నాసికాం పూజయామి

ఓం సూర్యచంద్రాగ్ని వారిణే నమః -
నేత్రే పూజయామి

ఓం సహస్ర శిరసే నమః - శిరః పూజయామి

శ్రీ లక్ష్మీనారాయణస్వామినే నమః
సర్వాణ్యంగాని పూజయామి

## అష్టోత్తర శతనామ పూజా

ఓం విష్ణవే నమః
లక్ష్మీపతయే
కృష్ణాయ
వైకుంఠాయ
త్రివిక్రమాయ
దైత్యారయే
మధురిపవే
తార్క్ష్యవాహాయ
సనాతనాయ
నారాయణాయ

ఓం గరుడధ్వజాయ నమః
పరబ్రహ్మణే
జగన్నాథాయ
వాసుదేవాయ
హంసాయ
సముద్రమథనాయ
హరయే
గోవిందాయ
బ్రహ్మజనకాయ
కైటభాసుర మర్దనాయ

ఓం పద్మనాభాయ నమః
హృషీకేశాయ
సుధాప్రదాయ
మాధవాయ
పుండరీకాక్షాయ
శ్రీమతే
శార్ఙ్గపాణయే
జనార్ధనాయ
పీతాంబరధరాయ
దేవాయ
సూర్యచంద్ర త్రిలోచనాయ
స్థితత్రేణ
పరాత్పరాయ
వనమాలినే
యజ్ఞరూపాయ
చక్రపాణయే
గదాధరా
ఉపేంద్రాయ
కేశవాయ
హయగ్రీవాయ
విశ్వంభరాయ
శింశుమారాయ

ఓం శ్రీధరాయ నమః
కామజనకాయ
శేషశాయినే
చతుర్భుజాయ
పాంచజన్యధరాయ
ప్రద్యుమ్నాయ
పురుషోత్తమాయ
శ్రీవత్సకౌస్తుభధరాయ
మురారాతయే
అధోక్షజాయ
ఋషభాయ
మత్స్యరూపాయ
కూర్మతనవే
క్రోడరూపాయ
నృకేసరిణే
వామనాయ
భార్గవాయ
రామాయ
హలనేత్రకలికినే
భక్తవత్సలాయ
నరాయ, త్రేధాఘ్నే
గజేంద్రవరదాయ

ఓం శ్రీకరాయనమః
కపిలాయ
ధ్రువాయ
దత్తాత్రేయాయ
అచ్యుతాయ
అనంతాయ
ముకుందాయ
దధివాహనాయ
ధన్వంతరయే
శ్రీనివాసాయ
సభసే
ఘనశ్యామాయ
జగత్కారణాయ
అవ్యయాయ
బుద్ధావతారాయ
శాంతాత్మనే
లీలామానుష విగ్రహాయ
దామోదరాయ
మోహినీరూపధరాయ
సంకర్షణాయ
పృధవే
క్షీరాబ్ధిశాయినే
భూతాత్మనే
అశ్వరుద్ధాయ

ఓం భూతభావనాయ నమః
శ్వేతద్వీప సువాస్తవ్యాయ
సూర్యమండలమధ్యగాయ
సనకాది మునిధ్యేయాయ
భగవతే
శంకరప్రియాయ
నీళాకాంతాయ
ధరాకాంతాయ
వేదాత్మనే
బాదరాయణాయ
భాగీరథీ జన్మభూమి పాద పద్మాయ
సతాంప్రభవే
విరాడ్రూపాయ
భూతభవ్యభవత్ప్రభవే
ఆదిదేవాయ
దేవదేవాయ
ప్రహ్లాదపరిపాలకాయ
కృతయుగరామాయ
ఉద్భవాయ
సున్దరాయ
సుద్దాయ
రత్ననాభాయ
సులోచనాయ

## ధూపం

శ్లో॥ దశాంగం గుగ్గులోపేతం, సుగంధం చ మనోహరం
ధూపం గృహాణ దేవేశ సర్వదేవ నమస్కృత ॥
లక్ష్మీనారాయణ స్వామినే నమః
ధూపమాఘ్రాపయామి.

## దీపం

శ్లో॥ ఘృతవర్తిసమాయుక్తం, వహ్నినాయోజితం ప్రియం
అజ్ఞాన నాశనం దేవగృహాణ శ్రీ మనోహర ॥
లక్ష్మీనారాయణ స్వామినే నమః దీపం దర్శయామి
ధూపదీపానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి.

## నైవేద్యం

శ్లో॥ పృధుకానక్షుఖండాః శ్చ కదళీఫలకానిచ
దాపయిష్యే త్వవత్ప్రీత్యై గృహాణ సురపూజిత
నైవేద్యం సమర్పయామి.

## తాంబూలం

శ్లో॥ పూగీఫలైస్స కర్పూరై ర్నాగవల్లీ దళైర్యుతం
ముక్తాచూర్ణ సమాయుక్తం తాంబూలం స్వీకురుప్రభో
లక్ష్మీనారాయణ స్వామినే నమః
తాంబూలం సమర్పయామి.

## నీరాజనం

శ్లో॥ నీరాజనం గృహాణేదం పంచవర్తి సమన్వితం
తేజోరాశిం మయాదత్తం, గృహాణత్వం సురేశ్వర
శ్రీ లక్ష్మీనారాయణ స్వామినే నమః
నీరాజనం సమర్పయామి.

మంత్రపుష్పం :- ధాతా పురస్తాద్య ముదాజహార శక్రః ప్రవిద్వాన్ ప్రదిశ శ్చతస్రః తమేవం విద్వానమృత ఇహ భవతి, నాన్యః పంథా అయనాయ విద్యతే, ఓం సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వసంభువం, నారాయణం దేవ మక్షరం పరమం పదం, విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిం, విశ్వమే వేదం పురుష స్తద్విశ్వముప జీవతి, పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతం నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణం, నారాయణ పరో జ్యోతి రాత్మా నారాయణః పరః నారాయణ పరం బ్రహ్మత త్త్వం నారాయణః పరః నారాయణపరో ధ్యాతాధ్యానం నారాయణః పరః, యచ్చ కించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా, అంతర్బహి శ్చతత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః, అనంత మవ్యయం కవిగ్ం సముద్రేంతం విశ్వశంభువం, పద్మకోశప్రతీకాశగ్ం హృదయంచాప్యధోముఖం, అధోనిష్ట్యా వితస్తా న్తే నాభ్యాముపరి తిష్ఠతి, జ్వాలమాలాకులంభాతి విశ్వస్యాయతనం మహత్, స న్తతగ్ం శిలాభిస్తులంబత్యాకోశసన్నిభం తస్యా న్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ త్సర్వం ప్రతిష్ఠితం తస్య మధ్యే మహా నగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః సోఽగ్రభు గ్విభజ న్తిష్ఠ న్నాహార మజరః కవిః తిర్య గూర్ధ్వ మధశ్శాయీ రస్మయ స్తస్య సంతతిః, సంతాపయతి స్వం దేహ మాపాదతలమ స్తకః, తస్య మధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః; నీలతోయద మధ్యస్థా ద్విద్యుల్లేఖేన

ఖాస్వరా, నీవారశూక వత్తన్వీ పీతా ఖాస్వత్యణూపమాత స్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః, సబ్రహ్మ సశివ స్సహరి స్సేంద్ర స్సోక్షరః పరమస్స్వరాట్, రాజాధి రాజాయ ప్రసహ్యసాహినే, నమోవయం వైశ్రవణాయ కుర్మహే; సమే కామాన్కామకామాయ మహ్యం కామేశ్వరో వైశ్రవణోదదాతు, కుబేరాయ వైశ్రవణాయ మహారాజాయ నమః తద్విష్ణో పరమం పదగ్ం సదా పశ్యంతి సూరయః దివీవ చక్షురాతతః, తద్విప్రాసో విపన్యవో జాగృవాంసస్స మింధతే విష్ణోర్యత్పరమం పదమ్, శ్రీ లక్ష్మినారాయణ స్వామినే నమః, సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి.

ప్రదక్షిణ నమస్కారాః :- శ్లో॥ యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ, తాని తాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదే పదే, పాపోఽహం పాపకర్మాహం పాపాత్మా పాప సంభవః, త్రాహిమాం కృపయాదేవ శరణాగతవత్సల, అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ తస్మాత్కారుణ్య భావేన రక్షరక్ష జనార్ధన, ప్రదక్షిణం కరిష్యామి సర్వాభీష్ట నివారణం సంసారసాగరాన్మాం త్వ ముద్ధరస్య మహాప్రభో శ్రీ లక్ష్మినారాయణ స్వామినేనమః ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి, గీతం శ్రావయామి, నృత్యం దర్శయామి నాట్యం సమర్పయామి సమస్త రాజోపచారాన్ సమర్పయామి.

ప్రార్థనా :- శ్లో॥ అమోఘం పుండరీకాక్షం నృసింహం దైత్యసూదనం, హృషీకేశం జగన్నాథం వాగీశం వరదాయకమ్ సగుణం చ గుణాతీతం గోవిందం గరుడ ధ్వజం, జనార్ధనం జనానందం జానకీవల్లభం హరిమ్, ప్రణమామి సదా భక్త్యా నారాయణ మజం పరం, దుర్గమే విషమే ఘోరే శత్రుణా పరిపీడితే, నిస్తారయతు సర్వేషు తథా నిష్టభయేషు చ, నామాన్యేతాని సంకీర్త్య ఫలమీప్సిత మాప్నుయాత్ లక్ష్మీనారాయణం దేవం వందేఒహం కాము దరం ప్రభుం లీలయా వితతం విశ్వం యేన తస్మై నమో నమః, శ్రీ లక్ష్మీనారాయణ స్వామినే నమః, ప్రార్థనా నమ స్కారాన్ సమర్పయామి.

శ్లో॥ యస్య స్మృత్యా చ నమోక్త్యా తపః పూజా క్రియాదిషు, న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే తమచ్యుతం, మంత్రహీనం, క్రియాహీనం భక్తిహీనం జనార్ధన యత్పూజిత మయాదేవ పరిపూర్ణం తదస్తుతే, అనయా ధ్యాన వాహనాది షోడశోపచార పూజయా చ భగవాం త్సర్వాత్మకః శ్రీ లక్ష్మీనారాయణ స్సుప్రీతో వరదోభవతు శ్రీ లక్ష్మీనారాయణ ప్రసాదం శిరసాగృహ్ణామి.

—•—

# సహస్రి కమలవర్తి వ్రితకథ

## అథ కథా ప్రారంభః

ఒకనాటి దినమందు కొంతమంది స్త్రీలు బ్రహ్మ యొక్క దర్శనమునకు వెళ్ళి ఆయనకు సాష్టాంగ నమస్కారము చేసినవారై

ఓ మహాత్మా! మమ్ములను స్త్రీలుగా సృష్టించినారు అందులోను నిరుపేదలను జేసినారు. భర్తగారి యొక్క ఆజ్ఞలకు లోబడవలసినవారమయి, అస్వతంత్రులమయి వున్నాము.

స్త్రీలయొక్క రజోదోషము పోవుటకు కొన్ని గొప్ప వ్రితములు శాస్త్రములయందు పెద్దలు చెప్పియున్నారు. అందు లాభం ద్రవ్యహీనులమైన మాలాంటివారికి లేదు సరికదా ఆ వ్రితములు రజోసంపర్కము వదలువరకు ఆచరించుటకు వీలులేదు. ఏభై సంవత్సరములు వచ్చువరకు రజోదోషము వదలకపోవచ్చును. అటు పిమ్మటకాని ఆ వ్రితము చేయుటకు అర్హులముకాము. అలా జీవించినవారికి ద్రవ్యహీనులకు సాధ్యపడదు. కావున అలా జీవించనివారికి అర్థహీనులకు ఏమి గతి? కావున మాయందు దయవుంచి రజోదోషమును పోగొట్టునది, సూక్ష్మంలో మోక్షమునుకూడ యిచ్చే ఒక వ్రితమును మీరు మాకు చెప్పవలెను అని వాణీనాధుని ఆ స్త్రీలు ప్రార్థనాపూర్వకముగా అడిగిరి.

## బ్రహ్మ చెప్పుచున్నాడు

ఓ నారీమణులారా! మీరు అడిగిన ప్రశ్నలకు నేను ఏమీ సమాధానము చెప్పలేను. అది నా పనికాదు. కావున శాస్త్రములు తెలిసిన మహామునులను అడుగుడు. వారు బాగుగా శాస్త్రములను తర్కించి మీకు సరియైన వ్రతము చెప్పుదురు అని బ్రహ్మ పలికెను.

## స్త్రీలు పలికినారు

అప్పుడు ఆ స్త్రీలు బ్రహ్మనుచూచి మమ్ములను సృష్టించిన ఓ భగవంతుడా! ఓ చతుర్ముఖా! మీరేకాదనిన మాకు దిక్కెవరు? మిమ్ములను కోరుట మా ధర్మము అని స్త్రీలు అందరూ బ్రహ్మ పాదములపై బడి అనేక రీతుల బ్రహ్మను ప్రార్థించగా స్త్రీలయందు బ్రహ్మదేవునకు అనుగ్రహము కలిగి నారదమునిని చూచి ఈ విధముగా చెప్పదొడగెను.

## బ్రహ్మ చెప్పుచున్నాడు

ఓ నారదా! స్త్రీల రజోదోషము తొలగే ఒక ఉత్తమమైన వ్రతమును ఆలోచించి, మిక్కిలి సూక్ష్మమైనది, సర్వ క్షేత్రముల యందును దశదానములుచేసిన ఏమి ఫలితము కలుగునో, సర్వతీర్థములయందు సంకల్ప యుక్తముగా స్నానమాచరించి ఏమి ఫలము గలుగునో, సూర్య చంద్ర గ్రహణములయందు దశదానములు చేసిన ఏమి ఫలితము లభించునో, గురుడు సింహరాశిలో ప్రవేశించగా గౌతమీ

నదిలో స్నానము చేసిన, దశదానములు యిచ్చినను ఎట్టి ఫలము గలుగునో, వాటియన్నిటికంటె విశేషఫలము కలది అయిన ఒక వ్రతమును చెప్పవలెను. కాని పెద్ద పెద్ద వ్రతములు చెప్పిన వారు ఆచరించలేరు. కావున సూక్ష్మ మార్గమున ముక్తిని పొందు వ్రతము చెప్పుమని నారదునితో వలికెను.

## నారదుడు చెప్పుచున్నాడు

బ్రహ్మదేవుని పలుకులు విని నారదులవారు ఈ విధముగా జెప్పదొడగెను.

ఓ వాణీవల్లభా! ఓ సృష్టికర్తా! స్త్రీల రజోదర్శనము పోగొట్టునది, సకల శుభముల నిచ్చునది, మహాపవిత్రమైనటువంటిది సూక్ష్మంలో మోక్షం ఇచ్చునటువంటిది దశశత కమలవర్తి అనుపేరుగల వ్రతము కలదు. ఆ వ్రతమును రాత్రి ప్రారంభకాలమున చేయవలెను. నిర్మలమయిన మనసుతో ఏ స్త్రీ ఆచరించునో ఆ స్త్రీ లోకమున అష్ట ఐశ్వర్యములు పొంది సుమంగళిగా వైకుంఠమును పొందును. దీపారాధన ఫలముచే పరమ పవిత్రులు అవుచూ శ్రీపతి కృపచే వారు గోపాలుని సన్నిధిని చిరకాలము నివశించుచుందురు. గురుడు సింహరాశిలో ప్రవేశించు నప్పుడు పవిత్రి గోదావరి నది పుష్కరము అనబడును. అప్పుడు మానవుడు దశదానములు చేసిన ఏమి ఫలము కలుగునో

అటువంటి ఫలితమును ఇచ్చు పవిత్ర వ్రతము. ఈ వ్రత మునకు గంగిగోవు ఘృతముతో దీపములు వెలిగించిన ఎక్కువ ఫలితము కలదు. సకల పుణ్యక్షేత్ర దర్శన ఫల మిచ్చును. కావున తప్పకుండ మోక్షముకోరు స్త్రీలు గంగి గోవు నేతితో దీపములు వెలిగించిన ఎక్కువ ఫలముకల్గును. అంతియేగాక ఇంకొక విశేషముకూడ కలదు. స్త్రీకి వున్న అన్నికోర్కెలను తీర్చును. రజోదోషమును హరించును. సిరి సంపదలతో తులతూగుదురు. కోటి బ్రహ్మహత్యదోషములు కాని, మహాపాపములుకాని అగ్నిహోత్రమునపడిన దూదివలె నశించును అని నారదులవారు బ్రహ్మతో చెప్పగా ఆ స్త్రీలు కొన్ని సందేహములను నారదులవారిని అడిగిరి.

## స్త్రీలు అడిగివారు

మహానుభావా! నారదమునీంద్రా! వ్రతమునయితే తెల్పిరి కాని ఆ వ్రతము ఎప్పుడు ఆచరించవలెను? ఈ పూజకు అధిష్ఠాన దేవత ఎవరు? మున్ను ఎవరైనను ఈ వ్రతమును ఆచరించిరా? అలా ఆచరించిన ఏమి ఫలిత మును పొందిరి. మా యందు దయతలచి వివరముగా దెల్పుడు అని నారదులవారిని ఆ స్త్రీలు అడిగిరి.

## బ్రహ్మ చెప్పతువ్నాడు

ఓ నారదా! వ్రతముయొక్క ఫలితములను కూడ చెప్పవలెను అని బ్రహ్మ పలుకగా!

నారదుడు చెప్పుచున్నాడు

ఓ పతివ్రతా శిరోమణులారా! మీరు నన్ను అడిగిన విషయములు తెల్పుట నా విధి కాకపోయిన, పతివ్రతల శాపమునకు పరమేశ్వరుడుకూడ బద్ధుడు కనుక వ్యాస ప్రోక్తంబైనటువంటి గొప్ప వ్రతము. ఇదివరకు కలియుగములో ఉన్నదికాదు, ఎవరూ ఆచరించినదికాదు. ఇటువంటి మహావ్రతముచేయుట స్త్రీలభాగ్యము. ఇదికూడ ఒకయజ్ఞం వంటిది. ఈ వ్రతము ఆచరింపవలసిన మాసములను, తిథులను కూడ చెప్పెదను సావధానముగా వినుడు.

కార్తీక, వైశాఖ, మాఘమాసములయందు ఈ వ్రతమును ఆచరించవలెను. ఇది ఏకాదశి; పూర్ణిమ తిథులందు ఈ వ్రతమును చేయవలెను. ఈ తిథులు పూర్ణతిథులై ఉండవలయును. గురు; శుక్ర మూఢములయందును, శూన్య మాసముల యందును ఈ వ్రతమును ఆచరించకూడదు. చిత్తశుద్ధితో నే జెప్పిన వ్రతమును ఆచరించినవారు ఇహపర సుఖములను పొంది రజోదోషముపోయి సుమంగళిగా విష్ణు సాన్నిధ్యమునుపొందుదురు. కావున స్త్రీలు తప్పక ఈవ్రతమును ఋతుసంపర్క దోషములతో సంబంధములేక వయస్సుతో సంబంధము లేక అందరును ఆచరించవచ్చును.

ఈ వ్రతమును ఆచరించువారు ప్రాతఃకాలమునలేచి కాలకృత్యములు నెరవేర్చుకొని పవిత్ర నదీస్నానమాచరించి పరిశుద్ధమైన వస్త్రములనుధరించి మనశ్శుద్ధిగా నుండవలెను.

ముందుగా పూజాస్థలమును గోమయంబుచే నలికి పంచ రంగులలో ముగ్గులుపెట్టి ముందుగా గణపతిపూజచేసి తరువాత చింపిన జానూరును పరచి దానిమీద ఐదు మానికల తండులములను పోసి ఆ మండపమునందు లక్ష్మీనారాయణ ప్రతిమను అవాహన చేయవలెను. తరువాత బ్రహ్మ కలశమును ఆవాహనచేసి, బ్రహ్మాదిదేవతలను అదిత్యాది నవగ్రహములను ఇంద్రాద్యష్ట దిక్పాలక సహితముగా మండపారాధనకావించవలెను. లక్ష్మీనారాయణ ప్రతిమను సువర్ణముతో యథావిధిగా చేయించవలెను. తదువరి షోడశోపచార పూజలు స్వామికిచేసిన విష్ణుమూర్తి సంతసించును ముఖ్యముగా శక్తికలవారు వెయ్యి వెండి ప్రమిదలను చేయించి వత్తులువేసి అన్ని ప్రమిదలను వెలిగించి విష్ణువును అరాధించవలెను. వ్రతముచేయించిన ఆచార్యుని విష్ణువుగ తలంచి వస్త్రదానము, గోదానము మొదలగు దానములు యథావిధిగా ఆచరించి ఆచార్యుని తృప్తిపరచ వలెను. వెయ్యిప్రమిదలను వెండితోచేయించవలెను. శక్తిలేనివారు మట్టిప్రమిదలను చేసి వెలిగించవలెను. లేదా ఒక ఇత్తడిది గాని, రాగిదిగాని పళ్ళెము తీసుకొని వెయ్యివత్తులు ఉంచి వెలిగించవలెను.

వత్తులనుమాత్రము ఆవునేతితో తడుపవలెను. వ్రతమును భక్తి శ్రద్ధలతో ఆచరించవలెను. వ్రతమును గృహమందు ఆచరించిన అధికఫలంకలుగును. నదీతీరమునగాని

దేవాలయమునకాని ఆచరించవలెను. (స్వంతగృహములేని వారు) వేదవిదులైన పదిమంది బ్రాహ్మణులకు అన్నదానం చేయవలెను. శక్తిననుసరించి దశదానములు చేయువలెను. వ్రతము చేయించిన ఆచార్యునకు షడ్రసోపేతముగా భుజియింపచేయవలెను. యీ వ్రతముచేసినవారికి దీర్ఘ ఆయుర్వృద్ధియు కలుగును. ఇహలోకమున సర్వసంపదలు కలుగును. దశశత కమలవర్తి వ్రతమును ఎవరైనను చేసినను చేసినవారిని చూసినను యీ వ్రతమును చేయువలయునను ఆసక్తిగలవారు సర్వ దురితనాశనములు పొందుదురు.

ఎవరైననుకాని ద్రవ్యలోపముచేత వ్రతమునుచేయలేక మనసున పరితాపమొంది శ్రీవిష్ణుప్రీతికై చేసిన వ్రతమును దీపములనుచూచి ఆ దీపములను నేత్రములకు అద్దుకొని నిర్మలమైన మనస్సుతో విమధ్యానముచేసిన భక్తులు పూర్వజన్మమందు చేసిన పాపములు యీ జన్మమునంధు చేసిన పాపములు తులారాశి నగ్నికణమువలె నశించును. వారి దేహము పరమ పవిత్రమగును. యీ వ్రతమును ఆచరించువారు, దీపదర్శనము చేసినవారు యీ లోకమున ఆయురారోగ్యములు పొంది ఐశ్వర్యవంతు లగుదురు. అనంతరమున విష్ణు సాన్నిధ్యమును పొందుదురు అని నారదుడు ఆ స్త్రీలకుచెప్పి మరల వార్నిచూచి ఓ పుణ్యవతులారా! దీనికి ఒక ఇతిహాసము కలదు. దానిని చెప్పెదను వినుడు.

పూర్వమున మహదైశ్వర్యము అనుపేరుగల పట్టణమున ధర్మాగ్రేశ్వరుడను రాజుగలడు. అతనికి భాగ్యశాలి అను పేరుగల కుమార్తెకలదు. ఆమె కార్తీకమాస పౌర్ణమి రోజున ఈ వ్రతమును చేయుచుండెను. ఆ గ్రామముననే నివసించుచున్న లాభాలశెట్టి అను ఒక వైశ్యుడుండెను. అయనకు చమత్కారి అనుపేరుగల కుమార్తెకలదు. ఆమె మహారాజుకుమార్తెచేయు వ్రతమును భక్తిశ్రద్ధలతో చూచి వ్రత ప్రభావమువలన రాజకుమార్తెపొందిన వైభవమును చూచి, చమత్కారికూడ వ్రతమునుచేయవలయునను కోరిక కలిగి తన తండ్రి చెంతకుపోయి వ్రతవిధానమును చెప్పి, తరువాత తన తండ్రినిచూచి తండ్రీ! నాచేతకూడ ఈవ్రతమును చేయించమని కోరెను. ఆ మాటలు చెవిన పడగానే లాభాలశెట్టి చెవిలో ఎవరో కాచిన సీసముపోసినట్లు బాధపడి కుమార్తెను చూచి ఈ విధముగా సమాధానము చెప్పెను.

అమ్మాయి! మనకెందుకమ్మ వ్రతములు సొమ్ములు చెల్లనివారికి గాని మనకు కాదమ్మ వ్రతములు. నా మాట నమ్ము. అమ్మా! మనము చేసిన పాపములు వెయ్యి వత్తులకు ఆవునెయ్యితో పోయిన ఈ లోకమున చాలామంది పాపములుచేసి ఈ వ్రతముచే పుణ్యాత్ములయితే అప్పుడు యమలోకములేదు, యమునకు పనిలేదు అని హేళనగా పలికెను.

అంత కుమార్తె మనంబున ఈ విధముగా బాధపడు చుండెను. నా తండ్రి లాభము లేనిభర్తృనకు అంగీకరించదు ఏమి చేయవలెను అని భగవంతుని పదే పదే ప్రార్థన చేస్తూ ఆలోచించి ఒక నిర్ణయమునకు వచ్చి తండ్రి గారికును సందు లేని సమయమున పూజా వస్తువులు జాగ్రత్తపరచి కార్తీకమాస పౌర్ణమియందు వ్రతమును చేయ సంకల్పించి తన స్నేహితులను బంధువులను పిలచి వ్రతమును అతి భక్తితో ఆచరించుచుండెను.

వ్రత సమాప్తి కాలమునకు గ్రామాంతరము వెళ్ళిన తండ్రి గృహమున ప్రవేశించి కుమార్తె చేసిన వ్రతమును చూచి రౌద్రరూపమును దాల్చి, కుమార్తెను చూచి నానా దుర్భాషలాడి నీకు ఎవరు ఒసంగిరి ఈ పెత్తనము. నా ఐశ్వర్యమంతయు ఈ విధముగా నాశనము చేయుటకు అని అనేక విధములుగా దూషించుచుండగా చముత్కారిమాత్రం తండ్రిమాటలు చెవినిపడకుండ నిశ్చలమైనభక్తితో నారీమణి స్మరణచేయుచూ పరమేశ్వరుని ధ్యానము చేయుచుండెను. అంత లాభాలశెట్టి ఉగ్రుడై దూషించిన పలుకులకు భగవంతుడు ఆగ్రహించి లాభాలశెట్టి ఐశ్వర్యమునంతయును నాశనము చేయగా లాభాలశెట్టి గర్భదారిద్ర్యము ననుభవించుచు భక్తి, జ్ఞాన, వైరాగ్యములు కలిగి భగవంతుని స్మరించుచూ ఓ భగవాన్ నాకిట్టి శాస్తి కావలసినదే, మూర్ఖుడనై అనరానిమాటలచే మిమ్ములను దూషించితిని. మహాను

ఖావా! ఆపద్బాంధవా! శరణాగత వత్సలా! శరణు శరణు అనువారిని రక్షించు ఆపద్బాంధవా నన్ను రక్షింపుము అని భగవంతుని ప్రార్థించెను. అంత పరమేశ్వరుడు ఆకాశవాణి రూపములో యీ విధముగా పలికెను.

ఓ లాఖాలశెట్టి దైవముతో హాస్యములు ఆడబోకు. యీ ఐశ్వర్యము, యీ తనువు శాశ్వతమనుకోకు. యీ రెండు నీవెంటరావు. నీవుచేసిని పాపపుణ్యములుమాత్రమే నీవెంట వచ్చును. నీవు నీ అజ్ఞానమును విడిచి పరిపూర్ణ భక్తి, జ్ఞాన, వైరాగ్యము పొందుటచే నీ ఐశ్వర్యము నీకు ఒసంగుచున్నాను. చమత్కారి నా భక్తురాలు కావున ఆమె చేసిన పాపములన్నియు నశించినవి. ఆమె పూర్వకాలమున యీ వ్రతముపట్టి, వ్రతసమాప్తిచేయకుండా కామవాంచా పరురాలై వ్రతమునువిడిచి భర్తతో రతికేళిలోతేలియాడెను వ్రతమును పాడుచేసెను. వ్రతభంగముచేసిన కారణముచే నీకు జన్మించెను. ఇప్పుడు ఆమె పాపము లన్నియు నశించినవి, యీమె నా సాన్నిధ్యమును పొందెను అని పరమేశ్వరుడు పలికెను. యీ కథను వినువారు చదువువారు, యీ వ్రతము చేయువారు ఇహమున సర్వ సౌఖ్యములు అనుభవించి పరమేశ్వరుని చేరుదురు. యీ కథను, వ్రతమును దూషించువారు ఇహమున దారిద్ర్యమనుభవించుచూ దరిద్రులుగాజీవించి పరమున నరకమనుభవించునని నారదుల వారు ఆ స్త్రీలకు యీ కథ వృత్తాంతమును చెప్పెను.

Scanned by CamScanner